# మధురవాణి - ౧

శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులు

'ముముక్షువు'
ప్రచురణలు :
రామచంద్రరావుపేట

# మధురవాణి - ౧

శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులు

'ముముక్షువు'
ప్రచురణలు :
రామచంద్రరావుపేట
ఏలూరు.

చతుర్థ ముద్రణము :
పందొమ్మిదివందల
డెబ్బైమూడు - మార్చి :
ప్రతులు : వేయి :

వెల : ఏబదిపైసలు :

'మమతూవృ'
ప్రచురణలు :
రా. రా. పేట
ఏలూరు.

'మమతూవృ'
ముద్రణము.

# ప్రథమ ముద్రణ

# పీ ఠి క :

## ప్రేమపూర్వక నారాయణస్మరణములు:

ఈ దశకములు ప్రచురించటం నాకు ఇష్టం లేదు. నేను కవినికాను. పద్యరచన నాకు అంతగా అభ్యాసంలో కూడా లేదు. అప్పటి కప్పటికి ఉన్న మానసిక స్థితి ఆ యా రూపాలుగా వచ్చింది. వచ్చింది వచ్చినట్టు వ్రాసిపెట్టాను. నా ఆవేదన, నా అనుభవం ఈ రూపం ధరించిన వేగాని మరేమీ లేదు. శబ్దగత దోషాలూ, వాక్యగతదోషాలూ తప్పు తెప్పలుగ ఉండవచ్చు. అందుచేత చాలా కాలం వీటిని ఎవ్వరికీ తెలియకుండా దాచిపెట్టాను. కొంతకాలానికి ముత్తేవి ఉదయవర్లు - ముముక్షువు సంపాదకుడు - ముత్తేవి లక్ష్మణదాసు - సహాయ సంపాదకుడు - చూచి, బలవంతంగా ముముక్షువులో రెండు మూడు దశకాలు వేశారు. అలా పత్రికలో వెయ్యటమే నాకు చాలా భయం అయింది.

ఇప్పుడు మా హైదరాబాదు మకాంలో బ్రహ్మశ్రీ చిట్టా వేంకట రామశాస్త్రిగారు - ముముక్షుజన సమాజం - ఆంధ్రప్రదేశ్ కార్య నిర్వాహక వర్గ సహాయ కార్యదర్శి - విన్నరాత్రి ఈ దశకాలు చూచి పట్టుపట్టారు - ప్రకటించి తీరాలి అని. నాకు భయం ఉన్నా, వారిపట్టా బలవంతం ఎక్కువ అవటంవల్ల అంగీకరించక తప్పలేదు.

కనుక సహృదయులు, "పిచ్చివాడు, ఏవో వ్రాసుకొన్నాడు" అన్న భావంతో, తప్పుల జోలికి పోక అంగీకరిస్తే - నాకు అంతకంటె కావలసింది ఏమిటి!

సజ్జనుల ఆదరణే ఈ లోకంలో అన్ని విధాలా శ్రేయోదాయకం.

హైదరాబాద :
దుర్ముఖి
భాద్రపదము :

— సీ తా రా ం.

# కృతజ్ఞతాంజలి

ఆధ్యాత్మిక కార్యాలకు తను సంపదను వెచ్చించటం అవశ్యకర్తవ్యమూ, సార్థకమూ అన్న విషయాన్ని సంపన్నుల్లో, చాలామంది విస్మరించిన ఈ దినాల్లో, ఈ పుస్తక చతుర్థ ముద్రణానికైన వ్యయం భగవదర్పణంగా సమర్పించి మార్గదర్శకులైన శ్రీమతి మద్దూరి చిట్టెమ్మ తల్లికి - కాకినాడ - మాహార్ద కృతజ్ఞతాంజలి !

— ప్రకాశకులు

# మనవి

శ్రీశ్రీశ్రీ యతీంద్రశంకర దేవులు అనుగ్రహించిన ఈ మధురవాణి- భక్తిరసామృత నిర్ఝరిణి : ఇది ప్రథమశతకం. ఇట్టివి ఇంకా తొమ్మిది శతకాలు ఉన్నాయి. ద్వితీయ శతకం కూడా ఇదివరలో ముద్రణ అయి ప్రతులు చెల్లిపోయాయి, ద్వితీయ ముద్రణకు సిద్ధంగా ఉంది. తక్కినవి వరుసగా ప్రకటింపబడతాయి.

ఈ ప్రథమశతకం మొదటిమారు ప్రకటించినవారు బ్రహ్మశ్రీ చిట్టా వేంకట్రామశాస్త్రిగారు - హిందూస్తాన్ డైరీ పబ్లిషర్సు - సికిందరాబాద్- వారికి మా కృతజ్ఞతలు : తృతీయ ముద్రణం ప్రతులు చెల్లిపోయి చిరకాలం అయినా - మళ్ళీ చతుర్థముద్రణం వెంటనే చెయ్యలేకపోయాం. ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న పాఠకులు ఈ జాగుకు క్షమించవలసిందిగా అర్థిస్తూ, ఈనాటికైనా అందించేందుకు అన్నివిధాలా సహాకరించిన శ్రీమతి మద్దూరి చిట్టెమ్మతల్లికి-కాకినాడ- కృతజ్ఞత - తెలుపుతున్నాం.

—సంపాదకులు.

# ప్రథమ దశకము

అ వ తా రి క :

...బాలకృష్ణుని విడిచి ఉండలేక
బతిమాలుతూ, ఆవేదనతో
ప్రార్థిస్తున్నది ఒక గోపిక ...

# పిలుపు

మొగమునందున చిఱునవ్వు మొలకలెత్త
పలుకు పలుకున నమృతంబు లొలుకుచుండ
మాటలాడుదుగాని నా తోటి నీవు
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

తలను శిఖిపింఛ మది వింత తళుకులీన
నుదుట కస్తూరితిలకంబు కుదురుకొనగ
మురళి వాయించుచును జగన్మోహనముగ
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

భువనముల నుద్ధరింపంగ బుట్టినావు
చక్కగా నీదు పాదాల నొక్కసారి
ముద్దు పెట్టుకొందును కండ్ల కద్దుకొనుచు -
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

నిన్ను జూడక నిముసంబు నిలువలేను
కాలమంతయు నాటల గడిపె దీవు
ఒక్కసారైన వద్ద కూర్చుండ వెట్లు ?
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

మరులుకొన్నది నీమీద మనసు నాకు
ఏమి చేసెదో ? ఏరీతి ఏలుకొనెదో ?
కాలయాపన సైపగా జాలనింక -
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

వెన్న యున్నది మాయింట కన్నతండ్రి !
పెరుగు మీగడతో బువ్వ పెట్టెదేను
జాల మింకేల నా మది సంతసిల్ల
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

ఎంత పిలిచిన రావేమి పంతమేల ?
అందుచేతనె నిను నమ్మరయ్యా జనులు
నన్ను రక్షింప వేవేగ కన్నతండ్రి !
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

భువనమోహన రూపంబు పొందగోరి
అలమటించుచునుండె నా ఆర్తహృదయ
మన్న ! భక్తార్తిహరుడన్న యశము నిలువ
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

ఆర్తితోడ రావే యని అడవి మృగము
కేక నిడగానె వచ్చి రక్షించితండ్రు
హృదయపూర్వకముగ కేక లిడుచునుంటి
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

నిలువజాలను రాకున్న పరమపురుష !
నీదు కరుణారసము చిందు నేత్రయుగము
చూచి పొంగ నా హృదయము వేచియుండె
పరుగు పరుగున రావోయి బాలకృష్ణ !

వినుతి 'పిలుపు' సీతారామ మునికృతంబు
భక్తితోడ పఠించెడి వారు జగతి
అతిశయానందమును కృష్ణు ననుభవించి
విష్ణు పరమపదంబున వెలయగలరు.

# ద్వితీయ దశకము

అవతారిక :

...ఆటలు మరగి, తిండికైనా రాని
కృష్ణయ్యా ఆగడానికి బాధపడుతూ
"లాలపోసుకుని బువ్వతిందువుగాని" అంటూ
బుజ్జగిస్తున్నది యశోదమ్మ ...

# లాలి

బాలు లందరికంటెను పసిమి మించి
మెరసిపోవుచునుందువు హరి ముకుంద !
వచ్చికస్తూరి నలుగిడి వెచ్చనీట
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

ఈవు పుట్టినరోజని ఎల్లవారు
కూడ నుత్సవములు జేసికొనుచునుండ్రి
ఈవు మురికితో నిట్లుండ నేలనయ్యా ?
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

ఇంటినిండ గోపికలు పేరంటమునకు
వచ్చిమూగిరి నీవిట్లు పిచ్చివాని
రీతి నున్నచో నవ్వరే నాతులెల్ల !
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

పచ్చికస్తూరి పునుగు జవ్వాజి గలిపి
నలుగుపెట్టగ గోపికల్ నిలిచియుండ్రి -
జాల మింకేల సేయు బంగారుతండ్రి !
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

ఈవు తీర్థమాడగ జూచు నిచ్ఛతోడ
కంజజ శివాది దేవతల్ గగనమందు
నిలిచియున్నారు భక్తి చేతులు మొగిడ్చి
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

చూడు రాధిక చక్కని చుక్కలాగ
దిద్దుకొని ఎట్లు వచ్చెనో ! తెలివిలేని
వాడవని నిన్ను నవ్వదా బాబు ? వేగ
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

కాయమంతయు వెన్నచే పూయబడియె
హాస్యమునకు గోపికలు నీ ఆస్యమంత
జిడ్డుజేసిరి - నీకేల సిగ్గులేదు !
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

నిన్ను జూచెడి వేడ్కతో నిర్జరులును
ఋషిగణంబులు వేంచేసి రింక నీవు
అటులెఉంటివి మట్టిలో నాడుకొనుచు -
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

'అన్న ! మన్నుతింటి విదేమిరా ?' యటన్న
ముఖమును తెరచి పదునాల్గు భువనములను
లీల జూపిన అద్భుత బాలకుండ !
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

సతము సఖుని సీతారామ యతిని కలిసి
నృత్యములు చేసికొనుచు భుజించమరచి
తిరుగుచుంటివి - వెన్నైన తినదుగాని
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

మేము చెప్పినను విన వదేమొ ! నీకు
నటుడు ప్రియుడు సీతారామయతి కరములు
మోడ్చి పిలుచుచున్నా డహో భువననాథ !
లాలబోసెద రావోయి బాలకృష్ణ !

# తృతీయ దశకము

**అ వ తా రి క :**

...భగవ దనుభవం కలిగిన
భాగవతో త్తముల యొక్కా,
భగవన్నామంయొక్కా వైభవం...

# భాగవత వైభవము - నామ వైభవము

అనిశము హరినామామృత ప్రాదమునందు
గ్రుంకులిడుచు తనివిదీర ద్రోలి ద్రోలి
మైమరచియు తన్మయత నున్మత్తుడైన
ధన్యునకు మించి సంపూజ్యుతము డెవండు !

ఎవరి ముఖకమలమునుండి 'కృష్ణ ! వాసు
దేవ ! హరి ! ముకుంద !' యనుచు దివ్యనామ
ముచ్చరింపంగ బడుచుండునో సతంబు
వారి శ్రీపాదములె మాకు తారకములు.

'కృష్ణ ! గోవింద ! హరి ! మురారీ !' యటంచు
కంఠమెత్తి పాడుచు నాడి గంతులిడుచు
పుడమి నున్మత్తుల విధాన మెలగుచుండు
వారె బ్రహ్మాదులకునైన వంద్యులరయ.

ప్రేమవిహ్వలహృదయులై 'రామ ! హరి
దేవ ! నారాయణా !' యంచు దేహస్మృతిని
వీడి నృత్యముల్ సలిపెడి విబుధజనుల
చరణరేణులె సకలార్థసాధకములు.

గద్గద స్వరయుక్తులై కంఠమెత్తి
ప్రేమమయులైన భక్తులు 'రామ ! కృష్ణ !'
యనుచు సేయు సంకీర్తన ధ్వనులచేత
అఖిలలోకములును పవిత్రంబులగును.

హరిపరాయణులును కరుణాబ్ధులైన
పరమభాగవతవరుల పాదధూళి
సోకిన పుడమి క్షేత్రమై శోభ చెందు
చెరువు తీర్థాగ్రగణ్యమై చెలువుమీరు.

భక్తి జ్ఞాన విజ్ఞాన సంపత్తి గలిగి
పరమవైరాగ్య నిధులైన భాగవతుల
చరణసరసిజముల వెంట తిరుగుచుండు
మరులుకొనియుండి మోక్షసామ్రాజ్యలక్ష్మి.

పరమభాగవతవరుల పాదధూళి
శిరమునందున దాల్చిన నరుల జూచి
పరుగుతీతురు కాలుని భటులు జడిసి
సింహమును గన్న మృగముల చెన్నుదోప.

కృష్ణ దివ్యనామానుసంకీర్తనాబ్ధి
మగ్నులగు ప్రపన్నుల యభిమానలవము
భయద దుర్వార దుర్భర భవమహాబ్ధి
తరణిగాదె జీవులకెల్ల తథ్యముగను.

కామ కాంచన కాంక్షల కాల్చినట్టి
కాంచనము మట్టిసమముగా గాంచునట్టి
కృష్ణునకు మించి ఇతరంబు నెరుగనట్టి
భక్తుల చరణధూళి మా భాగ్యమరయ!

భాగవతవైభవము నామవైభవంబు
ననియెడి నుతి సీతారామ యతికృతంబు
హృదయమున మననంబు జేసెడి మనుజులు
విష్ణు పరమపదంబున వెలయుగలరు.

# చతుర్థ దశకము

...భగవ దనుభవం కలిగిన
మహాత్ముడు తన్మయుడై
ఆనందంతో పొంగిపోతూ
తన స్థితిని చాటుతున్నాడు...

# స్వానుభవము

రామనామ మధుర సుధా రసము గ్రోలి
మత్తచిత్తులమైయుండి మదగజంబు
నధివసించిన మాకు నీ యధమవిషయ
శునకములవల్ల భయమేమి సుంతయైన !

సతము హరినామకీర్తనామృతపయోధి
నోలలాడుచు గ్రుళ్లు మత్స్యాలమైన
మాకు దుఃఖాలచూపైన సోకగలదె !
మాదు ఆనందమున కెల్ల లేదు సుమ్ము !

ప్రబల హరినామమన్ వజ్ర పంజరమున
అతిసురక్షిత శుకములమైన మాకు
వైరిమార్గాలముల వల్ల భయము లేదు
అతిశయానందమునకు విఘ్నాలు లేవు.

హరి మధుర సుధానామము ననుభవించు
మా కజాధిపత్యమును తృణీకృతంబు
ఖండశర్కర భుజియించి క్రోలువాడు
చవుడు నోటబోసికొనగ సాగునొక్కొ!

భోజనంబును పానీయములును ధనము
స్నానమును యజ్ఞ జప తప ధ్యానములును-
అన్నియును కూడ హరినామమయ్యె నింక
కావలసినదేమి జగతి గలదు మాకు!

సర్వభారములును శ్రీశు చరణయుగళ
మున సమర్పించితిమి జగతి నిక వాని
అమలనామమే జీవనమయ్యె మాకు
ఎందుజూడ నానందమే కందళించు.

సకల దేవతాధిపుడైన శౌరి చరణ
కల్పకము క్రిందను సుఖంబుగా వసించు
మాకు చల్లగ హాయిగా మనుటె గాని
విషయ తాపత్రయమ్ముల వెరపు లేదు.

భక్తి శ్రీశుపదముల ప్రపత్తిజేసి
తల్లియొడి పసిబిడ్డ విధాన మాదు
బాధ్యతలనన్ని త్యజియించి వాని నామ
మెపుడు పాడుకొనుచు సంచరింతు మేము.

అరయ సతము బ్రహ్మానంద మనుభవించు
మాకు తుచ్ఛమా మానావమానములును
కలిమిలేములు కష్టసుఖములనంగ
జాడయే తోచదెప్పుడు సత్యముగను
రవి యుదయ మొందిన తరి తారలవిధాన.

తల్లియును; తండ్రి, గురుడును దైవ మనగ
సర్వవిధబంధువులు కృపాజలధియైన
సర్వలోకశరణ్యుడు చక్రధరుడె
ఎచ్చటెటులున్న కొదువేమివచ్చు మాకు !

అతిమధురము సీతారామ యతికృతంబు
నైన ఈస్తోత్ర మెవ్వార లర్థసహిత
మధ్యయన మొనరింతురో అట్టివారు
విష్ణు పరమపదంబున వెలయుగలరు.

# పంచమ దశకము

అ వ తా రి క :

...కృష్ణవిరహం భరించలేని
ఒక గోపిక వేదన...

# విరహబాధ

అక్కట ! ప్రసిద్ధి కల దాయు వల్పమంచు
కాని, నా విషయంబున కల్లసుమ్ము !
నన్నమర జేసి దాగెను కన్ను మరగి
మరణమైనను రాదాయె చెలియ వినుము !

ఎంత వంచకు డక్కరో ! ఈ మురారి
ఒక్కసారి రానేల ? ఆ ఓరచూపు
పరపనేల ? నా హృది నదె వ్రణము జేసి
అలచుచుండె నటవిని దావాగ్నివోలె.

అసలు రాకపోయిన మేలె పొసగు గాదె !
వచ్చెపో, వానితోనె నా ప్రాణములును
పోవలయు, వాడు లేమిని జీవనంబు
భారమై తోచ నేనెట్లు బ్రతుకగలను !

వాడు లేమి నన్నియు వైరి వర్గమయ్యె
మలయ మారుత మెంతయు మాడ్చుచుండె
హిమకరుం డుష్ణకరుడౌచు ఏచుచుండె
వెన్నెలను గూడ ఇంతైన వేగలేను.

కోయిలా! దండ మిడుదును కూయకమ్మ!
చూడలేను శిఖి నెటకో తోలరమ్మ!
ఊదకమ్మ మురళిని నీ కోర్కె ప్రణుతి!
పలుక కా రెండు వర్ణాలు చెలియ వినవో!

తాపమును భరించగలేక తలిరుబోడి!
విరుల సెజ్జ నమర్చంగ వేడి తేను,
ఈవు కూడను వైరితో నేకమైతె?
మల్లెమొగ్గలు వేయించి చల్లితేమె?

నాదు ప్రేమంపు సఖులంచు నమ్మి, నేను
మల్లెమొగ్గలు ప్రక్కపై చల్లుమనిన
పూలకును మారు లోహంపు ములుకు లేరి
కాల్చి, ప్రక్కపై పోతురో కాంతలార!

కృష్ణు డింకను రాడాయె ఇంతులార !
అరనిముసము యుగము కంటె పెరుగుచుండె
కన్నులను నీరు కాల్వలై కట్టదాయె
ఒడలి నుండి ప్రాణాలైన వెడలవాయె !

ఏమిసేతును చెలులార ! కృష్ణు డింత
క్రూరుడై తన్ను నమ్మినవారి నిట్లు
ఏచునంచును కలనైన ఎంచినామె ?
సకియలార ! నేనిక ఎట్లు సైచగలను ?

నేను బ్రతుక దలంచితి రేని మీర
లిట్టు లూరకయుందురా ఇంతులార ?
యమునలోనైన దూకి ఈ అతుల బాధ
బాసి సుఖయింతు విరమింతు బ్రతుకునుండి.

వెన్ను నెడబాసి పడుచున్న 'విరహబాధ'
నరసి కవిత సీతారామయతి రచించె
ఆర్తితో దీనిని పఠించు అమలమతులు
విష్ణు పరమపదంబున వెలయగలరు.

## షష్ఠ దశకము

**అవతారిక:**

...కృష్ణ విరహంతో ఉన్మాదిని అయి
కృష్ణుని జాడ వెదకుకొంటూ, అందరినీ,
అన్నిటినీ అడుగుతున్నది ఒకగోపిక...

# అన్వేషణము

ఎన్ని బ్రహ్మాండములనైన నేల గలుగ
జాలు ఇంతింత కనుదమ్మి జంటవాడు
హృదయ ధన మెత్తుకొనివచ్చి ఇందు దాగె
చెప్పరే వాని జాడను చేడెలార !

అందముల చిందు నెమలి పింఛంబువాడు
దంబు మీరెడు విపుల వక్షంబువాడు
సుదతుల మనంబు హరియించు చూపువాడు
మీ పొదలయందు నున్నచో చూపరమ్మ !

పలుకు పలుకున తేనియ లొలుకువాడు
అందముల కాటపట్టైన సుందరీడు
మిసిమి మీరెడు నల్లని మేనివాడు
కంటిరే వాని మల్లియ కన్నెలార !

హంసలకు నడకను నేర్పు అందగాడు
అంబుదము బోలు శ్యామవర్ణంబువాడు
ముద్దులు గులికేటి మురళీ మోహనుండు
ఎచటి కేగెనో చెప్పరే ఇఱ్ఱులార!

నన్ను మురిపించి మరిపించి నటనజేసి
బాస లెన్నియో ప్రవచించి, మోసపుచ్చి
ఎచటి కేతెంచెనో నాదు హృదయ ధనము!
పలుకగలరమ్మ వన్నెల చిలుకలార!

కారుమేఘాల బోలెడి కాంతివాడు
కంజముల సౌరు నిరసించు కనులవాడు
వెన్నెలను గేరు చిరునవ్వు వెలయువాడు
ఇప్పు డిటువచ్చె - ఎందేగె చెప్పరమ్మ!

చూపుగోలల గోలల వేవువాడు
అందమున నంగజునకును అంగజుండు
అతివకై మున్ను ధర్మభంగంబుచేసె
అట్టి ధూర్తుని గంటిరే హరిణులార!

పురుషులను గూడ వలపించు మూర్తి జూపి
మమ్ము అంగజు బారికి మ్రగ్గజేసి
అల్లరికి పాలుజేసెటో అరిగినాడు -
బాల చూతమ ! కంటివే బాలకృష్ణు ?

కమలముల సౌరు నిరసించు కన్నుదోయి
మేన అందంబు వరదలై మీరుచుండు
దిశల వనమాల గంధంబు తేజరిల్లు
చూడరే ధూర్త కృష్ణుని ఈడలార !

నాతి ! వకుళాభరణులపై ప్రీతిచేత
వగి, తింత్రిణీశాఖల దాగెనేమొ
పోయి చూతము రావమ్మ వేయునేల !
శ్రీనివాసుని జాడను జెప్పగలము.

ఈ దశకము సీతారామ కృతము దీని
భక్తితో శ్రద్ధపెంపొంద పఠనజేయు
వారు పరమాత్మ కరుణకు పాత్రులౌట
విష్ణు పరమపదంబున వెలయగలరు.

# సప్తమ దళకము

**అవతారిక :**

...కృష్ణవిరహార్త అయిన ఒక మధురోన్మాదిని
కృష్ణుని తోడితెమ్మని, రాయబారం
నెరపమని కోకిలను అర్థిస్తున్నది...

# కోయిలా !

వృక్ష శాఖాగ్రమునుండి వీనులందు
అమృతధారలు కురియ, కృష్ణా ! యటంచు
పలుకుచుంటివి వతడు కనుపడగనోపు
ఎంత ధన్యవో కోయిలా ! ఏమిచెప్పుదు ?

వానిజూడక కన్నులు వాచిపోయె
నిలువలేనమ్మ కోయిలా ! నిలువలేను
కష్టమనుకోక యదుసింహు కడకుబోయి
పలుకవమ్మ నే పడుచున్న బాధలన్ని.

వాడు కరుణాసముద్రుడే, వాని ననగ
నేల నా వ్రాత ఇట్లుండ ? తాళజాల
పోయిరావమ్మ వేగమే కోయిలమ్మ !
వానిజూడక క్షణమైన బ్రతుకలేను.

సత్యముగ నా హృదయము వజ్రమ్మ సుమ్మ
కాక పోయిన వక్కలు కాకపోన ?
వాని మోహానమూర్తిని కానకుండ
నిలువగలనమ్మ ? కోయిలా ! నిముసమైన.

ఏది కోయిలా ! ఒకసారి నాదు చెవిని
కృష్ణయని పల్కి అమృతంబు నింపవమ్మ !
హృదయవేదన చల్లారు ఏది ? అనుము !
ఆహావా ! ఏది ? ఇంకొకసారి అనగదమ్మ !

వాడు లేనిది క్షణమైన బ్రతుకలేను
నీకు బరువైతినా ? సర్వలోకనాథ !
ఏమొ గతినాకు కోయిలా, ఈవె సుమ్మ !
ఎటుల దెత్తువో వాని ? నే నెటుల మనుదో ?

ఏల రాకుండెనమ్మ అందాలకుప్ప ?
సొంపు గులికెడు నాదు ప్రేమంపురాశి
క్షణముకూడ నన్ విడనాడి గడుపలేడు
ఏమి కర్మమొ ? కోయిలా ! ఇట్టులైతి.

బాసచేసెను నిన్నెప్డు బాయనంచు
ఆసలన్నియు నీవు డడియాసలయ్యె
తోయజాక్షుని ఎట్లైన తోడితెచ్చి
ప్రాణములు నిల్పు కోయిలా ! బ్రతుకలేను.

ఆ ! ఇదెక్కడి మధురరవంబు ? వినుము
మురళియె ! నిజంబు మురళియే ! మోహనుండు
వచ్చుచున్నాడు కోయిలా ! బ్రతుకుకంటె
మేలు మరువ లేనెన్ని జన్మాలకైన !

ఎంత దయగలవాడమ్మ ! ఈ మురారి
నిముసమైన నన్ను విడిచి నిలువలేడు
ఏమి ? కృష్ణ ! వచ్చితివ నన్నేలుకొనగ !
ఏది ? రమ్మ ! గట్టిగ కౌగలించుకొమ్మ !

మధురమిద్ది సీతారామమహాని కృతము
అర్థసహితంబుగా నెవ్వ రాత్రి గలిగి
సతము పఠియింతురో యట్టి సాధుజనులు
విష్ణు పరమపదంబున వెలయగలరు.

# అష్టమ దశకము

**అ వ తా రి క :**

...కృష్ణ విరహం భరించలేక
వ్యాకుల పడుతున్నది ఒక గోపిక...

# నీ వియోగంబు భరించజాల

ప్రజలు నను గూర్చి ఏమైన పలుకనిమ్ము !
ఏమి సేయగలను కృష్ణ ! నా మనస్సు
నిన్ను మోహనమూర్తిని గన్న దాది
మరులుకొనియుండి నీ నుండి మరలదెపుడు.

తుచ్ఛసుఖ పంకమున మగ్గి దొరలుచుండు
నరులు నిన్ను నన్నును గూడ తెలియగలరె ?
నిందలకు జంకి నే నెట్లు నీ వియోగ
కాలవహ్నిని భరియింపగలను కృష్ణ !

కృష్ణ ! గోవింద ! యని నిన్ను తృప్తిదీర
కోరి పిలుచుకుందమనిన నేరమాయె !
ఎట్లు వేగుదు వీరితో నేలనయ్య ?
నీవె సర్వంబు నాకుపో నీరజాక్ష !

వరద ! నీ వియోగంబును తలచినంత
మాత్రమున దేహమంతయు మండుచుండె
పుండుపైన కారంబును పూసినట్లు
ఇతరుల కొఱ కీబాధ భరించు టెట్లు ?

ఈ ప్రపంచమంత నను దూషించనిమ్ము !
కష్టముల మీద కష్టముల్ గలుగనిమ్ము !
ఏది ఎట్లైన కాని మ్రిక్కెంను కింత
కృష్ణ ! నీ వియోగంబు భరించజాల.

కృష్ణ ! వైభవంబులను జూపించి నన్ను
ఆశగొలిపించి మోహ కూపంబునందు
నణచ నెంచితే ? సకల బ్రహ్మాండములును
చాలు ! నొక్క నీ చూపుకు సాటియగునె.

అజ భవాదులనైన మోహమున ముంచు
అందముల కుప్ప ! నీ మందహాసమునకు
మరగియున్నది కృష్ణ ! నా మనసదింక
ఒక్క క్షణమైన విడిచి యెట్లుండగలదు ?

ఒక్క క్షణమైన నిను విడియుండజాల
కృష్ణ ! ఏమైన చెప్పు మదేల నన్ను
ఒదిలి వెళ్లితో నాపైన ఒట్టు ! నాదు
కాయమున ప్రాణముండుట కల్లసుమ్మ !

సకల మంగళావహము నీ చరణయుగము
మంగళాదిదేవతయె అమందమతిని
ఎప్పుడును కొల్చు, నా మాట చెప్పనేల ?
ఇంక నను వీడిపోకుము కృష్ణదేవ !

నిన్ను మోహనమూర్తిని గన్న వెనుక
ధర్మములను మర్యాదల తలగినైన
నిను వరింప కెట్టుండు నే వనితనైన ?
ఇంత తెలియవె ? గోపాలకృష్ణ ! చెవుము !

సతము దీని సీతారామ యతి కృతంబు
శ్రద్ధతో నర్థ యుతముగా చదువునట్టి
వారు పరమాత్మ కరుణకు పాత్రులౌచు
విష్ణు పరమపదంబున వెలయుగలరు.

# నవమ దశకము

అవతారిక:

...తన వశంలో ఉండి భగవదనుభూతికి
సహకరించిన మనస్సుకు కృతజ్ఞత
తెలుపుకొంటున్నాడు - ఒక మహానుభావుడు...

# మంచి మనస!

మంచి మనస ! నీ మూలాన మాధవుండు
ఇంత సులభుడై పోయె నా కేమికొరత !
శాశ్వతానందవార్ధిలో సంతతంబు
మునిగి తేలెడి భాగ్యంబు పొందగంటి.

మనస ! సత్యంబుగా నీదు మంచితనమె
కాకపోయిన దక్కునె నాకతండు ?
అతని ప్రేమామృతాబ్ధిలో నణగియుండు
భాగ్యమబ్బునె ? కొనుము నా ప్రణతులివియె.

మునులుబల్కిరిగద ! బంధ మోక్షములకు
కారణము నీవె యంచును! కాన, మనస !
రసమహోదధి కరుణ కర్తా తను గూర్చి
ఎంత తోడైతివమ్మ ! నీ కేమొనర్తు !

మనస ! ఇట్టులై వాని చరణసరోజ
ములను విడువకయుంటివో పలుకవలెనె
నాదు భోగంబు ! బ్రహ్మరుద్రాదులకును
తలపగ నశక్య మింకేమి తరుగు నాకు !

మనస ! నీవు వాని చరణ వనజములను
వదలకుంటచే నింద్రియవ్రాతములును
విడువకను వాని సేవలో మెలగుచుండె-
ఇంతకంటెను వలసిన దేమిగలదు !

ఎట్లు తీర్చుకొందును నీదు ఋణము మనస !
అహాహా ! ఏమి యానంద మే మనుభవంబు !
నన్ను క్షణమైన విడువ డానందజలధి-
ఇంత భాగ్యమునకు నీవె హేతువుగద !

మనస ! ఎన్నిమారులు నీవు వనజభవుని
భోగములు కూడ మితిమీరి పొందలేదు ?
తథ్యము వచించు నామసుధామధురము
లో సహస్రాంశమైన బోలునటె యవ్వి ?

నేను చెప్పినట్లుగ వినుదాన వీవు,
వానినే శరణని యున్నవాడ నేను,
దయకు నిలయమాయెను వాడు- తలచ మనస!
ఏమి భయ మింక ప్రకృతి నన్నేమిచేయు?

నీవు వశమైన భక్తిలో నిలచియున్న
ఇంక జన్మరాహిత్యం బదేల మనస!
ఇక్క డక్క డెక్కడనున్న నేమికొరత?
ఎక్కడైన నానందమే పిక్కటిల్లు.

తెలియకను చేతగాకను పలుకుచుంద్రు
నిన్ను వైరియనుచు కొంద రెన్నగాను
నీకు మించిన మిత్రుండు లోకమందు
కలడె నిజముగా పరమార్థగాములకును!

సతము దీని సీతారామయతి కృతంబు
శ్రద్ధతో నర్థయుతముగా చదువునట్టి
వారు పరమాత్మకరుణకు పాత్రులౌట
విష్ణు పరమపదంబున వెలయగలరు.

# దశమ దశకము

అ వ తా రి క :

...సంసారం నుండి తరించాలంటే,

భగవదనుభవం పొందాలంటే,

భక్తి వినా గత్యంతరం లేదు...

# భక్తి వైభవము

బంధమున జిక్కి అల్లాడు బద్ధులార !
భయద దుర్వార సంసార వనధి దాటి
శాశ్వతానందధామవాసమ్ము కోర
భక్తి కంటెను వేరొక్క పథము గలదె!

అతి భయంకర సంసరణాబ్ధి దాట
తపము లేల ? యోగాధ్వర జపము లేల ?
ప్రవచనంబులు జ్ఞానముల్ వ్రతము లేల ?
భక్తిలేకున్న నన్ని నిష్ఫలములుగద !

మనకు శాస్త్ర చర్చలతోడ పనియులేదు
వాదములు వద్దు, గీత సవాలు చాలు
వినుడు "భక్త్యా త్వనన్యయా"-యనెను గాన
ముక్తి కేకైక మార్గంబు భక్తియెనుడి!

వాద తర్కాలతో పనివలదు మనకు
చాలు "భక్తివశః పురుష" యనెడి శ్రుతి
పలుకుచున్నాను నమ్ముడీ ఉలుకులేక-
భక్తి యొక్కటె మార్గంబు భవముదాట!

వినుడు చెప్పెద మాటలు వేయునేల-
ఆతని "స్మరామి మద్భక్త"- మనెడి సూక్తి
తలచుకొనిన చాలు హిమాద్రి ధైర్యమొసగు
ఇంక భవములేదు, భయమదేల మనకు ?

అతని భజియించువారల కభయమొసగె
హరి "అహం సముద్ధర్తా" యటంచు పలికి-
కాన ఇంకేమి కావలె ? వాని నామ
భజనసేయుడు- తప్పదు భవము బాయు.

అతడు మాయాధిపతి గదా ! అట్టివాని
నాశ్రయించిన వారల నతని మాయ
ఏమి సేయు ? రవిని సమీపించువారి
నంధకారంబు వోలె- నాశంబుచెందు.

చూడు "మామేవయే" యన్న సూక్తి, వాని
పాదముల నాశ్రయించినవారి కింక
మాయకున్ జిక్కపనిలే దుపాయ మదడె
ఇంక హాయిగ వాని భజించుకొనుడి!

మాయను తరించు బాధ్యత మనదైవైన
భయము చెందవలెను గాని, వానిదైన
ఇంక భయమేల వాని భజించుకొనుచు
కాల మానందమయముగ గడుపు కొనిన!

పరమయోగుల కందని పదవి గోప
సుందరు లనన్య భక్తిచే చూరగొనిరి
కాన, భక్తి కన్నను ఏమి కానరాదు
సత్యమిదియ! ముమ్మాటికి సత్యమిదియ.

భక్తివైభవ స్తోత్ర మీ పద్యదశక
మనగ నిద్ది సీతారామ మునికృతంబు
శ్రద్ధతో దీని సార్థంబు చదువువారు
విష్ణు పరమపదంబున వెలయగలరు.